# "కపిగంగన్న"

(మరోవంద పద్యాల గంగరాముడితో)

గంగాధర్

శ్రీ శ్రీనా పబ్లికేషన్స్

నవ్యాంధ్ర సాహితీ నవకమ్ము వెలదిమ్మ
గ్రంథమ్ము రచియింప గర్త యెవరు
లోకాల నూగించు శ్లోకాలు తనజీవి
తముగాగ చరియించు ధర్మియెవరు
బ్రహ్మాండ మెప్పుడైన బరిలోన వెనుకంజ
వేయని సాహిత్య వీరు డెవరు
హృదయా మృతము నీడి సదయుడై శిష్యుల
పంతాలు నెగ్గించు పంతు లెవరు
అట్టి మా గురుమూర్తికి అర్పించి
నాదు కైత ధర్మము విశ్వస కుసుగంటి
సీతరామ భట్టాచార్య శేముషీ ధు
రంధరునకు నిచ్చితి భక్తి సుగంధముగ

కళకం అనగానే, ఏ దేవుళ్ళమీదనో, కనీసం ఏ లులా యంమీదనో, వ్రాయడమే ననుకుంటారేమో! అదికాదు లేక, కొందరువ్యక్తులను అధిక్షేపించడానికో మాత్రమే కాకుండా, మనసంగతులు-లోకం సంగతులూనున్నా, చెప్పకోవచ్చు నంటున్నాను-అయితే, ఈ విషయం ఎంతవరకు సాధించానసే నిర్ణయం, చెయ్యవలసింది నేనుగాదు గనక, ఆవిషయం అసలుఎత్తుకోను. కొత్తదనం Technique లోగాని, Direction లో గానీ, ఏమున్నా ఉంటే, అది ఎలాగూ, పుస్తకం చదివేప్పుడు తెలుస్తుంది.

ఇహా, ఇంతకీ చెప్పాలనుకున్న విషయమేమంటే:—

మనందరికీ, ప్రతిదాన్నీ, కేవలం పుస్తకాలతో సంభవించిన, లేదా సంక్రమించిన, ఏదో ఒక కోణపు సారస్వత దృష్ట్యా మూడ్డం అలవాటైపోయింది. ఇది, నా పొరపాటనో, మీ గాఢ్యమే అనుకుంటారో, ఈ నాటిపరిస్థితుల సమగ్ర దృష్టితో, చూడవలసిన అవసరం ఉంది—

ఇహా, శాశ్వతత్వాల తాలూకు తర్జనభర్జనలు ఎలాగూ తేలిచావవు గనక, ఒక వేళ ఏమన్నా వ్యక్తిగతమైన సంస్కృతి మూలంగా, Permanancy తాలూకు Conviction అంటూ

ఉండడం సంభవించినా–అది సంఘానికి అవసరమైన విషయం కనకా, ఆ సంగతి వదిలేద్దాం.

పోగా, ఇందులో కొంతమంది చచ్చిపోయిన వాళ్ళ తాలూకు ప్రస్తావనలు, వాళ్ళు చావకముందే వ్రాయడం జరిగింది.

మరోవిషయం—

సాంతం చదవకుండా, అభిప్రాయాలు మాత్రం మనక్కోలా పారేయకండి! విమర్శ అయినా, ఆకస్మాత్తుం లాగించేసిన బాణం లాగా, ఆసాంతం చదివి చేస్తేనే, దానిలో పస్తుంటూ ఉంటుంది.

నచ్చిందా–మరోసారి చదవండి! విషయం తెలుసుకోండి!

లేదా!–విసిరిపుచ్చుకు పారేయండి!

అంతే! కాని,

చదవకుండా విమర్శించుకున్నాం!

హైదరాబాదు
1–మే–1951

త్రిపురనేని బాలగంగాధరరావు.

దివిజ లోక భయంకర పవరమిద్ది
మనుజ శుభంకరానంత మధనమిద్ది
రక్త జలపాత మేళన రాగమిద్ది
అగ్ని సింహాసనాసీన రాజ్ఞి ఇద్ది

# "కవిగంగన్న"

అతిగా నీతులు జెప్పెడి
మతి బోయిన పండితులకు మతి తెప్పించున్
మతములు చచ్చిన మానవు
కతలను వినిచెడి శతకము కవిగంగన్నా 1

దేముని గొలిచెడు వారికి
గోమయమే బుర్రను గలుగున్ లేకుంటే
దేముడు శాసకు డైనన్
శాపములు భువినెట్లు గలిగె కవిగంగన్నా 2

సత్యాగ్రహమే నిత్యము
సత్యము చెప్పెడు నరునకు సద్గతి గలుగున్
భత్యము కొరకే భువిలో
గత్యంతర మేమి గలదు కవిగంగన్నా 3

మనిషికి పశువుకు భేదా
మనగలుగుటలో గలిగెడి మనసేగద
మనిషికి అంతకు మించిన
ఘనతలు లేవని మొరుగుము కవిగంగన్నా 4

కలవారి సొంపులెరుగక
గలమే పెరవారియింట కాటికైనన్
విలయమ్మైనను గానీ
కలనాదములే తెలుంగు కవిగంగన్నా 10

రుసరుస లాడుచు బండిని
పసరము మూర్గమ్మునెక్కి మరిమరి వెదకున్
ముసలికి బుద్ధియు నల్లి
కసవు మెసవు దున్నపోతు కవిగంగన్నా 11

యువకత్వములో హృదయము
నవనవలాడక గలిగెడి నవ్యస్త్రీశాక్ర
కవకన వచ్చెడి నెత్తురు
కవితకు తాలలయు సిరి కవిగంగన్నా 12

యుగసంధిలోన మనుష్యులు
భగభగ మండెడి మానసులు ఘోరముగాగన్
వగతో చెప్పెడి నవ్యత
ఖగపతి దెబ్బకు యమున్నిపాము కవిగంగన్నా 13

జననము చిత్రమే మరణము
జనించెడనె కలిగియుండు చనిపోయినవో
తినలేవు నీవు సౌఖ్యగాని
గనుమా శ్రీమంతుయుసిరి కవిగంగన్నా 14

మరణము వచ్చినదంటే
తిరిగి జనించుటలు లేవు దేవుని కైనన్
తరమే లెక్కలు వ్రాయగ
కరణాలెందరు గలిగిన కవిగంగన్నా 15

బుద్ధి సగం తినివేసిన
పెద్దల చూపులు తలపగ శిరముపై నే
మిద్దెల దన్నుచు నెగిరెడి
గద్దకు చూపెక్కడుండు కవిగంగన్నా 16

హాస్యము శోకము గలిసిన
సర్కసుడే వేషగల్లు కాకుచు నేకన్
శీర్షము లొత్తిడి విప్పిన
ఘూర్ణణ తప్పక జరుగును కవిగంగన్నా 17

రైతే జనులను బ్రతికిం
చే తండ్రి బాగువాడు చేలో పంటల్
రాత్రాలకె పోవు రయితు
కాతరు మించుక పనవలె కవిగంగన్నా 18

కూలీ యనగా లోకము
పాలించెడి భావములకు మన్మథుడే ఆ
కూలీయే లేకున్నన్
ఖాళీయౌగద జగత్తు కవిగంగన్నా 19

గొప్ప తనమ్మే మనమ్మై
చెప్పులు మోయించుకొనుట చేదంటావే
తప్పుసుమా నూతులలో
కప్పలు కావలసినన్ని కవిగంగన్నా 20

ధర్మము ధర్మమ్మని యీ
మర్మము లెందుకు సుఖాన బ్రతుకగ లేవా
చర్మములో చచ్చే నీ
కర్మకు నేనేమిచేతు కవిగంగన్నా 21

భాషాదాస్యం చేసే
తాషామరపా కవులకు ద్రావకమిస్తే
రోషా లెందుకు వచ్చును
కాషాయ మహేశ్వరులకు కవిగంగన్నా 22

లేనితనంలో ఊహలు
కానీకొకటైన కలుగును కడకా బుద్ధే
బోణీ లేకుండా నే
కానీ కరువై నశించు కవిగంగన్నా 23

మోషేటుంగు నేర్చే
పాషాణము లుండరాదు పాశవులంతా
వేషాలు మార్చితె లెన
ఘూ పాంథైజనులపోల్కి కవిగంగన్నా 24

జంతు నశించెడి నూతన
బింకముతో విక్రమించి బిచ్చపుమనిషై
పంకా ద్రిప్పిన నీరవ
కంఠాళమె ప్లవించు కవిగంగన్నా 35

నేతాజీ బోసంటే
పాతాళము త్రివ్వజేసి పాపపుబుద్ధుల్
పాతరవొక్కె చరిత్రల
ఖాతాలను మించెనంట కవిగంగన్నా 36

వస దాగినట్టి పిట్టలు
పసనీడిన పాతభావ వాసనతోడన్
విస విస వాగెడి మంత్రులు
కసరు గలుగు రోజులోయి కవిగంగన్నా 37

పరహితమే స్వహితముగా
పరకార్యము లోర్చువాడు భారవిపక్షా
పర మొందదెన్నడేని ని
కరమీ బుద్ధియె జగాన కవిగంగన్నా 38

చెదలు చెదలుగా బుట్టిన
కథకులతో పోల్చవద్దు ఖండనకవితా
మదమెక్కిన సింగమ్మిది
కదనానికి సిద్ధమయ్యె కవిగంగన్నా 39

తెలుగు తనమ్మే భయమై
చెలగెన్ మహనీయమంత్రిశేఖర మనముల్
కలగెన్ మహోన్నతపదవి
కలదు త్రిలింగరుధిరాన కవిగంగన్నా 40

చండప్రచండ విప్లవ
ఖండన మొనరించుశక్తి మాదేనోయీ
మొండీ ఎరుగము మమ్ముల
గండర గండాంధ్రులంచు కవిగంగన్నా 41

పాతకు బైబై చెప్పే
మోత కులిక్కిపడుటేల భోషాణములో
నీ తలదూర్చి వినుము వి
ఖ్యాతమ్మగునట్టి బోధ కవిగంగన్నా 42

పేలవమై మనబ్రతుకే
గోలయిపోవును మనసార గ్రాడ్డై పోవన్
మేళమురా మనుషులకీ
కాలేజీ చదువువద్దు కవిగంగన్నా 43

రొంపిని గలకార్మికులకు
తెంపరులై గొంతుచావు దెచ్చుట కన్నం
తెంపిన చరిత్రకీ భూ
కంపాలే సాక్ష్యమంట కవిగంగన్నా 44

నవ్యత కోరకై బాధలు
భవ్యచరితులే పడవలె పాషండసరుల్
దివ్య సుధీమయ జీవిత
కావ్యము వ్రాయంగలారె కవిగంగన్నా 45

తెల్లని టోపీ దాలిచి
చల్లగ మాటాడువారు సైతానులురా
కల్లంగడి సంస్థలురా
కల్లసుమా నమ్మరాదు కవిగంగన్నా 46

చర్మము వర్ణాకు లోకమై
ధర్మము తనజీవితాన్ని తార్చుకతిసగన్
కర్మమ్మని యేడ్చుటయే
కార్మిక జీవన ఫలితము కవిగంగన్నా 47

వీరే ప్రజలే రాజులు
పరీ ఇతరులనుచు జన మెదుపుటగిపె
వారే ద్రోహులు మసలను
కారాగారముల లోకి కవిగంగన్నా 48

హెచ్చిన శౌర్యం మాదే
చచ్చిన భానములు మావి సాంతము రేంమా
గుచ్చెత్తినచో ఎరిగెడి
కచ్చుకు ఫలితము చరిత్ర కవిగంగన్నా 49

ఎవడీ లోకమ్మై ప్రేనుకు
పవరపు సందున సమయము వ్రాసెడి డ్రైవర్
అవనీ జనములు వానిని
కవనాధీశునిగ నెంచు కవిగంగన్నా 50

ఎరువంటేనే భయపడి
పరుగెత్తేస్తారు గాని మనుషుల అందా
తెరుపేసని ఏడ్చెదరీ
ఖర నిర్వాణ సుఖమేల కవిగంగన్నా 51

ఆడతనానికి సూత్రపు
తాడు బిగించుటలు దక్క ధర్మము లేదన్
గోడు వినిపించె నెవడో
గాడెక్కిన ముండమోపి కవిగంగన్నా 52

అరవిందునిలో గలదట
పరమార్థము డోకువప్ప భారతమతమే
స్థిరమట వేదాంతములో
కరణపు లెక్కించకోయి కవిగంగన్నా 53

రదనాల్ బిగియించెడి
క్కదనము సిద్ధించిపోయె కంఠీరవముల్
మదగజములపై నెగిరెడి
కదనము లేకున్ననేమి కవిగంగన్నా 54

కుర్రోడే ఎర్రోడై
ఛరుత్రిన తేస్తే కవితలు చదువుకునేస్తే
మొర్రో కుయ్యో యనవలె
కర్రల పెత్తనపు జనులు కపిగంగన్నా 55

శోకం నేనై మరి నా
తోకలు మీరై జ్వలించు తోర్ణాలకు పా
రా కాయిస్తే నేనొక
కాకాసుర కర్రి మొద్దు కవిగంగన్నా 56

ఎందుకు మసకెందుకు ఈ
మందగొడి నడకల మెదడు బాధితశోకాల్
బంధించే మొద్దిది ఈ
కందుకమున్ పగలగొట్టు కవిగంగన్నా 57

ఈ కోపాలెందుకు ఓ
మేకల్లారా తలకొక మేకై మీకో
బాకై పోతాననియూ
కాకోదర కుందవరపు కవిగంగన్నా 58

మతరాహిత్యము వస్తే
నెతలన్నియు బోవునుగద వెర్రితనమ్మా
మతసామరస్య బోధము
గతిపోవగ త్రాగు గంజి కవిగంగన్నా 59

పరభాషలు మనకొద్దీ
పురుగులు వదిలేయుడంచు భోరున జెప్పే
స్వరములలో వినబడు నీ
కరికర వర్కెందుకంట కవిగంగన్నా 60

ఛెంగున నే దుర్జాతుల
సంఘముపై దూకితేను శాస్త్రిల బుర్రల్
డంగై పోతే అంతా
ఖంగులు తింటారి దేల కవిగంగన్నా 61

వమ్మయిపోయిన అతి భా
రమ్మయి పోయిన బ్రతుకున రంగము తెలిసెన్
నెమ్మది నరుల కబద్ధం
కమ్మని వస్తువు జగాన కవిగంగన్నా 62

మానవుడికీ మహా శూ
న్యానికి సంబంధము తెలియాలంటే ఈ
సోనా లెందుకు హృదయ
గ్లానియె దీనికి నికషము కవిగంగన్నా 63

ప్రళయం విలయం అంటే
ప్రళయం వస్తుందటోయి పాసిన బుద్ధుల్
జ్వలియింప జేయు సంగం
కళనా రంగములు లేక కవిగంగన్నా 64

నవ్యాంధ్రకవి హిమాలయ
భావ్యుడు శ్రీశ్రీని బట్టి బారలు చాస్తూ
సవ్యం తెలియక వాగే
కావ్యజులకు సిగ్గు లేదు కవిగంగన్నా 65

శ్రీశ్రీ లోనన్ కవితా
ఘశ్రీ లింకిన కవులిట గలికినాడే
విశ్రాంతిస్తే మూర
కృప్రోతస్సు ఫలియించు కవిగంగన్నా 66

పంతము వేస్తూ ఈ చే
మంతులవలె వాడిపోవు భావశిరాలన్
బంతుల మాదిరిగా చిరు
గంతులు వేయించ వత్తు కవిగంగన్నా 67

పరవనితా గమనమ్మే
పరకాయంలో ప్రవేశ వాక్యార్థముగా
పరమూ నిజమూ తెలియని
గరితల కిది మోక్షమనిరి కవిగంగన్నా 68

మారేజీ వద్దంటే
పోరా పక్షీ యనెదరు పొట్టలు నిండే
మారేజి నాకు మోటర్
గారేజీ లాగ ఉంది కవిగంగన్నా 69

నేనొక గోళాన్ని సుహృ
ద్ధానాంకిత జయ శిలీముఖాన్ని అనంతో
ర్వీ నాకైన నిషానా
కానన మిది యొక సవాలు కవిగంగన్నా 70

ఆస్తిక వాదం సాగర
శోస్త్రాలన్నీ కలంచ గూడెను ఆ యీ
మస్తులు పోవలె గాకే
గస్త్రియో కాదికపని కవిగంగన్నా 71

హృద్భారము మెండగుచున్
మృద్భావముతో గవయుగ మీ కళ్లల్లో
సద్భావాలన్నిటి జ
గద్బింబము తేలి యాడు కవిగంగన్నా 72

దక్షిణ భారతభువిలో
దక్షిణ నాయకులు లేరు దక్షిణ పాత్రల్
భక్షణకూ రక్షణకూ
కక్షలు పెంచుట గలదిట కవిగంగన్నా 73

త్యాగం అంటే అర్థం
రోగమ్మని తెలుసుకోండి రోగికి స్వార్థం
త్యాగంగా కనిపించును
కాగా రోషాలు పెంచు కవిగంగన్నా 74

పల్లెల్లో సౌందర్యం
చెల్లాచెదురుగ గలదట చేతము బెదిరిం
దల్లా ఈ వాక్యం ఒక
కల్ల నిజమోగిరితమని కవిగంగన్నా 75

వేదిత రోదస్సూ నర
మేధస్సూ కలిసిపోవు భీకర సమరం
బాధామయ లోకానికి
కాదంబరియై నిలిచెను కవిగంగన్నా 76

చర్విత చర్వణ రచనల
దుర్వార ప్రతిభ తోడ దూరము సేయన్
సర్వాంధ్రులకై చేసెద
గర్విత కవితా ప్రతినలు కవిగంగన్నా 77

ఈ విశ్వాంబర వీధిని
ఏవో విహరించునూహ లేవో బాధల్
లావా లా ప్రవహించును
కావిక పూత కనుపించు కవిగంగన్నా 78

కాలానికి కళ్లెం వే
యాలని వేవే చదివితి యూర్ ఈ నెంబర్
మేలే ఇందుకు ముందొక
గాలా నే వేయుచుంటి కవిగంగన్నా 79

ఎందుకనా ఆ కాలపు
కందుకమును గాల మంటగా కళ్లెం నీ
వందిస్తే పోగలదా
కం దేట్లు బిగించెద మరి కవిగంగన్నా 80

నాకేదో ఒక లోకం
ఈ కష్ట సుఖాల లోక మీ భూలోకం
రేకే చాలుంటానికి
కాముల్లా వెతక లేను కవిగంగన్నా 81

కష్టమో విష్ఠూరమొ
ఇష్టము నాకీ జగమ్మొ హృదయాలన్నీ
భ్రష్టాయువులై కరగున్
కష్ట సుఖాల రతిలోన కవిగంగన్నా 82

మన యీ శరీరము పనే
జనుల కుపకరించు టైన చంటల్లాలా
వినుడీ సత్యము వారాం
గనయే త్యాగాత్మ యగును కవిగంగన్నా 83

అదిగాదు స్వార్థమంటే
రొదరొద గా నేడ్చువారు రూపించేలా
మదమెత్తి ప్రజా రక్తాం
శ ధనము నాశించుటయ్యో కవిగంగన్నా 84

ఏ బాటా లేని పురా
డాబా ఇటుకల కలుపుచు టంకారించే
మా భారతీయులు నిజం
గా భారము గాదు భువికి కవిగంగన్నా 85

విలయూక్త సిక్త మధురాం
చల రక్తాశ్రువులలోన జారిన చేలాం
చలము సరిదిద్దుకే నా
కలమొనరించు నవగీతి కవిగంగన్నా 86

నీతిని అవినీతిని మన
జాతకమున రంగరింప చాలా తెలిసెక్
నీతులనే గోడలపై
శాతామే పరమ బూతు కవిగంగన్నా 87

వెనకా ముందూ సరిగా
కనలేరీ అర్థడాగ్సు కాల భ్రమణా
వ్రణములు ఋూ భక్ష్యలనో
ఘన జనతా పారగొట్టు కవిగంగన్నా 88

నే పిలుపిస్తే వచ్చును
శాపాలెన్నున్న నేమి సమరతురంగం
సోఫాల్లో నిదురించే
కాపీనులపై కురగక కవిగంగన్నా 89

ఆర్చేవారా అప్పులు
తీర్చేవారా అనంత దేభ్యాల్లా తేయీ........
చర్చిందుకు నా సిగరెట్
ఖర్చుల లెక్కలు మీదు కవిగంగన్నా 90

వెన్నముక లేక భావను
సున్నము సున్నముగ జేయు సుకవీశ్వరు డ
న్నన్నా సాహిత్యములో
కన్నుచెర వదలని వనిత కవిగంగన్నా 91

చరమాంకము ప్రారంభిం
చిరి దైవానికి జగత్తు చేతన మయ్యెక్
భరత వాక్యము నేనే
కరమెత్తి రచన మొనర్తు కవిగంగన్నా 92

అల్లరిగా ఈ లోకా
న్నల్లన మాడెడ మిక జగదూనువులన్నీ
ఛెళ్ళున మ్రోగే లాగా
గల్లంతై పోయి తీరు కవిగంగన్నా 93

మార్పంటే తెలియని ఓ
సర్పాలూ నా జవాబు శాసన మిదిగో
దర్పపు మీ ప్రతు కారిన
కర్పూరం లోని కంపు కవిగంగన్నా 94

బిత్తరి చూపులతో యీ
మెత్తని మాటలివియేల మీకిక జడవం
నెత్తుటి వాకలు నింపెడి
గత్తర వోలె నురికెదము కవిగంగన్నా 95

అబ్బొబ్బ మాటన్నది
నిబ్బరమైనట్టి గుండె నీతియె మేమౌ
డబ్బా గొంతుల లోనన్
గబ్బే గంధమనిపించు కవిగంగన్నా 96

నియమము లేకుంటా ప్రతి
కె యనుకము గమకము నందు కీర్తులు మనమై
భయమింటే భావమెరుగ
క్ర యముని నడిపించవలయు కవిగంగన్నా 97

లయఘుంటూ రావాల స
మయమిదిగో పగ్గత్తిల్లై మాయాజాలాల్
పయనించి హిమ గిరులలో
గయ కొట్టుచు వడి ధ్వనించె కవిగంగన్నా 98

క్రాంతీ రాద్ధాంతము మరి
శాంతీ సిద్ధాంతము వరుసన్ గలిపేసే
పంతం లోనే పుట్టును
కాంతిచ్ఛటల సమశాంతి కవిగంగన్నా 99

గుండెలు బండలుగా రా
బండలు గుండెలుగ జేయు ప్రతిభల్ గల యీ
దండ శ్రమించెదు వారికి
గండము ట్రాన్స్వపను లోన కవిగంగన్నా 100

శృంఖల భంగములో శ్వో
శాంకము ముగియ పయనించి ఆర్తజనాళుల్
బింకము చూపెడి వోటున
కంకాళము గర్జ సేయు కవిగంగన్నా 101

అన్నము తింటూ ఇది కా
దన్న మిదే శూన్యము నెడ యంబర దష్టుల్
తన్నులు తింటే నీ తెలి
గన్నుల కెందుకు నిశీధి కవిగంగన్నా 102

పల్చని ప్రేవులలో గని
త్రొల్చిన జన రక్త శాణా తోపుల లీలన్
దాల్చి జయించుటతో ఈ
కల్చర్ నా ధర్మపత్ని కవిగంగన్నా 103

వార్తలు మానవ ధన మన
భర్తలు జంటలుగ గూడి ఫస్టు కలాస్సు
బెర్తుల పై వసియించెడి
కర్తవ్య వ్యథలు చాలు కవిగంగన్నా 104

రెక్కలు ముడుచుకు పోవన్
దిక్కులు చూస్తారిదేల దివ్యము లాగా
నిక్క కనపడదా నెత్తురు
కక్కిన యీ బక్కరైతు కవిగంగన్నా 105

జీవిత సౌధం నిన్నే
సేవించెదునట్లు జేసి శేషప్రశ్నల్
భావించబోక నశించిన
కావగలవిట జగశ్శాంతి కవిగంగన్నా 106

భస్మం శ్మశాన భస్మం
భీష్మించుకు పోయినట్టి భీషణ రుధిర
శ్లేష్మంలో జీర్ణించెడి
కశ్మల రేఖల చరింతు కవిగంగన్నా 107

మా యీ మహా శ్మశాన
స్థాయిని జయించిన కవితా రావంలో
ఛాయా మృత్యుంజయున్
కాయము సిద్ధించగలదు కవిగంగన్నా 108

తన రక్తరేఖ దిద్దిన
ఘనతర కవితా కళా వికాసము నిండన్
నను బెనిచినట్టి తండ్రికి
జనదే తనపాదమంటు శతకము గొనగన్

ఎన్నడో తలచిన ధర్మపన్నములివి
ఎన్నడో మలచిన శిల్పమిదిగదోయి
ఎందుకో పడిపోదువీ యేటిలోన
కలికళంకమహాధామ గంగరామ 1

అరవలు కుమతులనుకునే ఆంధ్ర తృప్తి
ఆంధ్రులొట్టి లొట్టియలనే అరవ తృప్తి
కలిసిపోవ తప్పదుగోరి గాలివాన
కలికళంకమహాధామ గంగరామ 2

యుగయుగాలు ఘోషించిన యువశక్తి
సర్వనాశమై పోవుడో సంబరపడు
నీ బ్రతుకు ఒక బ్రతుకేన
నిజము చెప్పు
కలికళంకమహాధామ గంగరామ 3

నాటి కర్రము బానిస నాడు
నేడు నీతి కర్మము అవినీతి నీకు
అసలు ఈ రెలిటివిటీ కోతికి ఎక్కడుంది
కలికళంకమహాధామ గంగరామ 4

ఏలు కన్యాపిఁయసును కాద్వేలు భావములు
జగత్తు నిది నిజము
కలుగబోదు నెగులబోదు మరేదైన నీతిబోధ
కలికళంకమహాధామ గంగరామ 5

ఉన్న విషయము
నే చెబుతున్న మాట నీకు నచ్చితేనే విను
లేక బుద్ధితక్కువెందుకంటే దారి తప్పు కెళ్ళు
కలికళంకమహాధామ గంగరామ 6

నాకు వద్దురా నాయనా లోక గాధలని
విసుక్కున్న మాతాృన
జనులను వదిలేసిపోవునా వ్యధలు దురాశగాక
కలికళంకమహాధామ గంగరామ 7

ఒక్క చెట్టు నాక్తే చాలు
గుక్కనిండిపోయినంత తిండి దొరికిపోవు గాన
భయము లేదను ఆహారమంత్రి మున్ని
కలికళంకమహాధామ గంగరామ 8

నాయకుడవు కావాలని
నాడి గోణిగి కోరిక పుడితే
తెల్ల టోపీ రికాబు చాలు
పిచ్చి ప్రజాశ్వాన్ని తోలగలవు
కలికళంకమహాధామ గంగరామ 9

ఒక్కసారి నాయకుడివై మొక్క కలిగినావా
ఇక ఫరవాలేదు
తాన తందనాన యనవచ్చు మరి యే యిజానికైన
కలికళంకమహాధామ గంగరామ 10

పోషలిష్టువైతే నీవు
వేషభాషలన్ని మార్చనక్కరలేదు
కొన్ని మాటలను విడబరిచితే చాలు ఘనత వచ్చు
కలికళంకమహాధామ గంగరామ 11

ఆరి పోవు దీపపు కాంతి
అధిగ నుండునన్న ఆర్యోక్తి నిజమయ్యె
కన్నులున్న ప్రతి మనిషికినీ కాంగ్రెసు పట్ల భక్తి
కలికళంకమహాధామ గంగరామ 12

వత్సర త్రయం లోపలే
మత్సరాలు ఎన్నియో పెరిగినవని ఎంచుటేమి
ఎన్ని గొంగళ్ళ వెండ్రుక లేరగలవు
కలికళంకమహాధామ గంగరామ 13

ఎవరు ఎంత వాగేసినా ఏమి ఫలము
ఎవరికా జవాబిచ్చేడి అవసరాలు
రాజ దండ ధర పటేలు రాజ్యమేలె
కలికళంకమహాధామ గంగరామ 14

చీన జనుల గుర్తించినా
సీమ దొరల స్నేహాబంధము తెగగొట్ట నీరు గాన
ఇండియా నాయకులు గొప్ప దండి మగలు
కలికళంకమహాధామ గంగరామ 15

మా విదేశాంగ నీతియే మాన్యమైన దంచు
ఏ ఉపన్యాసాలు దంచి వేసి చెప్పినా
అంత ఎరుగని మఖ్ఖ లెవరు
కవికళంకమహాధామ గంగరామ 16

బ్రతుక లేని వానికి తిండి
బ్రతుక గలుగు వానికీ బాధ వద్దని
పట్టు పగలె చెప్పగలడట
ప్రధ్మంత్రి శేఖరుండు
కలికళంకమహాధామ గంగరామ ! 17

ఒక్కొక సారి నా మనసేమొ
తెలకతెలకమనిపోవు నీ తత్వ శాస్త్రపు పోగు జూచి
అసలు పూర్ణ నరునికి తిండనవసరము
కలికళంకమహాధామ గంగరామ 18

మీరు ఎన్ని చెప్పిన నేమి
మేము మటుకు మా మనసు లోని సూత్రాలు మరువ లేము
కూటి కోసమే ఇంతగా గొడవ తగునె
కలికళంకమహాధామ గంగరామ 19

తిండి తక్కువైతే మీరు
మెండుగా వ్రతములు జేయుడు
మన దేశ నవ్యత కొరకింత మాత్రపు పని జేయ నిష్ట
పడరె
కలికళంక మహాధామ గంగరామ 20

నేను తెలివిగల మనిషినే
మారేమి చెయ్యగల నూరికే వాగి వెయ్యగలను
ఇట్టి ఆఫీసు లనిన నే నీసడింతు
కలికళంక మహాధామ గంగరామ 21

అసలు కోతట
అందులో నగ్గి దొక్కె నంట
ఇంక దాగినదట ఆసవమ్ము
అప్పుడు నూరి గంతులు వేయుటబుగంబె
కలికళంక మహాధామ గంగరామ 22

కాంగ్రెసన నాటి కాంగ్రెస్సు కాదురన్న
ఇంటి పేరు కస్తూరి వారింట లోని
గబ్బిలాల కంపెన్న నా యుబ్బు తగమొ
కలికళంక మహాధామ గంగరామ 23

గాంధి గారి సత్యాగ్రహంబందు గనిన
కలదు గాంధిని సత్యము
కడమ నాగ్రహమ్ము మాత్రమె గలుగు నీ యను
చరులను
కలికళంక మహాధామ గంగరామ 24

నాయక వినాయకులు గల్గు నాడు
మనకు పెట్టుబడి లేక యే సమకట్టు
పెద్ద పెద్ద వ్యాపారు లందరి మించుదురట
కలికళంకమహాధామ గంగరామ 25

భరత దేశానికి చరఖా బుగఖ వదులు
సంత వరకు మోక్షము లేదు
అట్టి దినము వచ్చుటకు తెగవలె నన్నా గచ్చ పొదలు
కలికళంకమహాధామ గంగరామ 26

పాత చింత కాయల పచ్చడి తనువుకు
మంచి పథ్యము తినుడను
వంచకకుల నాయకమ్మన్యులే మన నాథులు గద
కలికళంకమహాధామ గంగరామ 27

పాత రోజులలో
గోచి పాత రాయుడే జగము నేలిరట
ఇప్పుడీ జనమ్ము లెందుకో
పాత వారన్న నేహ్య పడుట
కలికళంకమహాధామ గంగరామ 28

లోకమంత పోయిన గాని
పాక్ప్రధాని ఎన్ని కేక లేసిన గాని
ఎన్న లేని సంపదల బొల్చు కాశ్మీరు జారనీము
కలికళంకమహాధామ గంగరామ 29

కొత్తదైన స్వాతంత్ర్యము గుత్తకొనునుగాక
నా పరువే పోవు గాక
విడువజాల కాశ్మీరను జవహర్లాలు నెహ్రు
కలికళంకమహాధామ గంగరామ 30

అధికముత్పత్తి చేయుడు
అప్పటికన ఏండియు రెండు నాటికి
ఎట్టులైన దిగుమతుల బియ్యము మనము దినగ
రాదు
కలికళంకమహాధామ గంగరామ 31

చెప్పెడిది నెహ్రూజీ మరి చేయునదెవరో
ఇదున్నదే గదరా
గురుతర భాషలు విజయుని వంతు జరుప శ్రీలోలు
వంతు
కలికళంకమహాధామ గంగరామ 32

మిమ్ము మించు దద్దమ్మలు మేదిని గలుగరిది నిక్కము
నేను గాక మరి యొరులు
గలుగ రిట స్టేట్సుమన్‌లను చలము నెహ్రు
కలికళంకమహాధామ గంగరామ 33

ఆంధ్రరాష్ట్రము వచ్చినా ఆగిపోయినా సరేగాని
గుజరాతు ఘోష చూడజాలని పటేలు
వారి రాష్ట్రము నొసంగు
కలికళంకమహాధామ గంగరామ 34

అన్న మెందుకు
సున్నమీ యన్నము దినరాదు
పెద్దన్న మంత్రిలు రాజ్యమేలుతున్న రోజని
వారిని దూరరాదు
కలికళంకమహాధామ గంగరామ 35

నా గొడవలో ఇరక వద్దు
జాగరణము సేయ వలసి వచ్చును సుమా
సేతు లంఘన మొనరింప దలంచు హనుమను నేను
కలికళంకమహాధామ గంగరామ 36

నియమముల నరి కోనేటి నీట గలిపి
మరతు లేకుండ బ్రితుక నే సాహసింతు
బ్రతుకు కోసమని ముఖారి పాడ లేను
కలికళంకమహాధామ గంగరామ 37

ఓట్ల పోలింగు లోపలి గట్లు తెంచి ప్రాంగు జనము
పోలీసు నూలింగు హెచ్చు
నీ డెమోక్రసీ పరదాల పాడిలోన
కలికళంకమహాధామ గంగరామ 38

తెలివిని కరణము లిట ఘనులని
తెలియపరచిన పురుషు డనయము మనకొరకని
రాజ గోపాలు డాగజు పూసగాడు
కలికళంకమహాధామ గంగరామ 39

ఆంధ్రరాష్ట్రము రాదని అడలెదరిట
దానికందిలే కారణ మో నిరీహ తేజులార
మీనెత్తురు తెలుసుకోండి
కలికళంకమహాధామ గంగరాము 40

కేంద్ర మంత్రుల బుద్ధికి మంద్ర ఫణిత పట్టుటయు
నాంధ్రరాష్ట్రము వచ్చుటయును
జరిగిన జరుగ గలదేమొ చచ్చు వెనుక
కలికళంకమహాధామ గంగరాము 41

టంగుటూరను వాసపు బొంగు ప్రేలు
రంగు లీను రంగా
కళా మ్రింగు కళలు
అయ్యదేవర సంధత్వ మావహించు
కలికళంకమహాధామ గంగరాము 42

అశ్విని భరణి కృత్తిక
అరయగమరి ఉత్తరాషాఢ ఆరుద్ర ఉత్తరయును
పూష రోహిణులే మన వేష కవులు
కలికళంకమహాధామ గంగరాము 43

మాది ఆ స్వర్గమును గాదు
మరి నరకము దానికి మునుపే గాదు
మధ్యను త్రిశంకు స్వర్గమని చెప్పు నీరుండు జైప్రకాశు
కలికళంకమహాధామ గంగరాము 44

మాట కోసమే గాని
నాకీ టమారమెందు కన లపోజిషను లేదిందు గాన
నే నపోజిషన్ కొరకను నేత రన్న
కలికళంకమహాధామ గంగరామ 45

సిగ్గు లేని వేదాంత శాస్త్రీలు
ఎగ్గు లేని రాజకీయాల భూజానులు
గలరీ భరత దేశ భాగ్యము నేమనందు
కలికళంకమహాధామ గంగరామ 46

విధవ పెండ్లిండ్లు జేయగ వీలు లేదు
సధవ పెండ్లిండ్లు జేయుట సాగ నీరు
అధవ పెండ్లిండ్లు జరుపుట కర్థమేమి
కలికళంకమహాధామ గంగరామ 47

నవాలు వాని కన్నను మ్రింగు నరుడు
దొడ్డ యనుట నిజమే గదన్నయ్యా
మన తలలను దూషు నీ నేత మనకంటె దొడ్డ గాదె
కలికళంకమహాధామ గంగరామ 48

ఈ ఉపన్యాసముల కేమి
ఎంత లీజరు గలిగిన నంత జనము కరిగెదు నట్లు
వాగ వచ్చును రొచ్చుకు నాగ వచ్చు
కలికళంకమహాధామ గంగరామ 49

రాజ్యమది వీర భోజ్యము
రాజులకగు గొప్ప తనముల కాలాన
ఇప్పుడు మరి రాజరికము వాగ్భోజ్యము రామకృష్ణ
కలికళంకమహాధామ గంగరామ 50

చీకటి బజారు వర్తక మీ కరణిని సాగ రాదని
బుగ్గలు సాగదీయు వారలే
సంజ చీకటి వర్తకులట
కలికళంకమహాధామ గంగరామ 51

బ్లాకు మార్కెట్టు పోగొట్టి
చాకు బట్టి గొంగ లందరి తెగగోయ నున్న యెడల
గోకి నట్టి పుండగు నిది కాకి తిండి
కలికళంకమహాధామ గంగరామ 52

గాంధి గారు కంట్రోలును కాల దన్ను మనగ
ఎదిరించి చెప్పినట ఘనత రిన్న
అవసర కమిటీ దెచ్చు నధ్యక్షు పదవి
కలికళంకమహాధామ గంగరామ 53

ధనము నాశ మొందును గాని
గానము చర్య ప్రబల దీక్షయు నో మానవా.
హృదంతరాళములలో అనంత స్థిరముగ వెలుగు
కలికళంకమహాధామ గంగరామ 54

హైదరాబాదు తాను ముందంజ వేసి
సంస్కరణ మొనరింప వే సాగె నోయి
కాగితాల మాత్రానికి ఖాత రేల
కలికళంకమహాధామ గంగరామ 55

చేసినను చెయ్యకున్నను
చేసినంత మాట చెప్పిరి చాలును
బాస కేమి ఎన్ని జేసి తప్పగ లేదు నిన్న మొన్న
కలికళంకమహాధామ గంగరామ 56

మనకు వ్యవసాయ సంస్కారమనిన మంట పుట్టుకొచ్చు
సంస్కరణపు బుద్ధి పుట్ట
సంస్కరించెద వెట్లు సంస్కార శూన్య
కలికళంకమహాధామ గంగరామ 57

అచ్చు గుద్దినట్టగుపించె ఆక్టు జూడ
దాని యాదర్శమున కేమి తక్కువ
సంగోర భయమున్నదదే సెల్ఫు కండెమింగు
కలికళంకమహాధామ గంగరామ 58

అసలు మా రాజకీయవారసుడు నెహ్రూ
కొసరు మాత్రమే మొదలిడి పసరు పూసి
పిసపిస పటేలు ప్రజకు తా నెసరు పెట్టె
కలికళంకమహాధామ గంగరామ 59

ఎంత సేపేంటి
గడియలో వంద స్టేటుమెంటు లైన
కేంద్ర గవర్నమెంటు మంత్రి శేఖరులు
మహోద్దండులు చేయగలరు
కలికళంకమహాధామ గంగరామ 60

రాజమండ్రి లో యుద్ధము రాజుకుంది
పాలడబ్బా ఖరీదులో గోల పుట్టి
అందుకు కొరిగా యుద్ధమే అంజనమట
కలికళంకమహాధామ గంగరామ 61

ఇనుప గజ్జెల తల్లి కరుణ గలిగిన
భయము లేదైదు రాళ్ళకు పసి శిశువుల
నమ్మ కథనమ్మ వినిపించు నప్పు డొప్ప
కలికళంకమహాధామ గంగరామ 62

నాకు తెలివి లేదని ఒప్పు కోక
ఏమి చెయ్యమంటారు
మరి వాడు చెప్ప వీడు చెప్ప
నేనైతే కంపెనీ చెప్పు వోలె
కలికళంకమహాధామ గంగరామ 63

తెలివి గలిగిన కాలేజి తెగడ వలయు
బుద్ధి గలిగిన భార్యను పొగడ వలయు
మనసు కుదిరిన సిగరెట్టు మాన వలయు
కలికళంకమహాధామ గంగరామ 64

శీత సాగరాగ్ర కోతకు తెప్పున్న నీవు
నేప్ప గంగ వారింపగో నిండి నారు
నైజమిదియె నీకీ నాటి భోజనమ్మె
కలికళంకమహోధామ గంగరామ 65

మనుషులకని సంఘ మొకటి మన గలిగిన నాడు
పశువుల కోరకగు పాడు సంఘ మేల లేదు
ఈ మాయల జాల మేమి
కలికళంకమహోధామ గంగరామ 66

పాత సంఘపు సంస్కృతి
పారు లేని చింతపల్లి పుగాకట
కంత లేని దంట
నాకెత్తు నరికాలి మంట తలకు
కలికళంకమహోధామ గంగరామ 67

ఈ కవిత్వపు పైత్యము
నీకు నెత్తికెక్కినది గదా
దీని కా కక్కు మందు గలదో లేదో
జాల్నా కు బోవలయునేమొ
కలికళంకమహోధామ గంగరామ 68

తరణి తేజంబొకింతయు తగ్గ లేదు
వసుసగా మింట తారకల్ దొరలలేను
విప్లవ పథమ్మె చేజేత పీడ నేల
కలికళంకమహోధామ గంగరామ 69

తెలియని మనిషి నెట్టులో తేర్చ వచ్చు
తెలియు మనిషి సందేహముల్ తీర్చ వచ్చు
తెలిసి తెలియని మనిషిని మలచలేము
కలికళంకమహాధామ గంగరామ 70

బుద్ధి లేని వానికి బుద్ధి పుట్ట బోదు
బుద్ధి గలుగు వానికి బుద్ధి పోవ లేదు
బుద్ధి గలిగియు లేకున్న బుద్ధు డగును
కలికళంకమహాధామ గంగరామ 71

చచ్చిన మొగుడు చావగ
పచ్చి యవ్వనమ్ముల పొంగెడు కోర్కెలు
నాతి నంట రాదట
తలకాయ గలదో బోధకులకు
కలికళంకమహాధామ గంగరామ 72

ఆడదానికీ మగవాడికీ
డవాలు తప్ప తేడాలు లేవని తలచు నాడు
నాల్గు గోడల నీతులు నాశ మొందు
కలికళంకమహాధామ గంగరామ 73

చదువు కాలేజి లో నైన సతికి నల్లె
జైలు దాని కంటెను మంచి చదువు నేర్పు
పట్టి బుద్ధి హీను లగుట గట్టి మాట
కలికళంకమహాధామ గంగరామ 74

దేవుడొక్కడే ఉన్నచో దేవులాటలేల
ఎందులకీ బుద్ధి లేని తనము
చాలు మీబోధ స్వాములు జాలు వారు
కలికళంకమహాధామ గంగరామ 75

విని విని విసుగు బుట్టును
వీరి బోధలింక వినరాదు
రాముడు లంక లోన రాజ్యమేలిన
తెలివియు పూజ్యమగును
కలికళంకమహాధామ గంగరామ 76

అన్నపూర్ణ యట మనల గన్న తల్లి
అన్నము కరువై పడుదుము బన్నములట
రామను గల దేశపు వృద్ధి రాత్రి పూట
కలికళంకమహాధామ గంగరామ 77

ఆంధ్రులందరు నాటకా లాడ గలరు
తమిళు లందరు సాంబారు త్రావ గలరు
ఔత్తరాహులు విప్లవ మాప గలరు
కలికళంకమహాధామ గంగరామ 78

రామ రాజ్యము రావలె
మేము చేయు కార్య మంతయు నందుకే గాక యున్న
వన మహోత్సవ మొనరించి వాగ గలమె
కలికళంకమహాధామ గంగరామ 79

మనము గొప్ప వాళ్ళ మనగా వినరు మీరు
మన అశోకుడు బుద్ధుడు ఘనుడు గాంధి
గొప్ప వాళ్ళని గొంతెత్తి చెప్పగలము
కలికళంకమహాధామ గంగరామ 80

మందుకైనా నడువ వలె
అంద లేక పోయిన వెనుక కైసను మొగ్గ వలెను
గాని రెండువైపుల చూపు గలుగ రాదు
కలికళంకమహాధామ గంగరామ 81

బర్తు కంట్రోలు గావలె
భారతీయ జనులధికముగ నుత్పత్తి జరుప వలయు
అప్పుడు జరుగ గలదట అభ్యుదయము
కలికళంకమహాధామ గంగరామ 82

వర్తమాన కాల మనుష్య వర్తమాన
మందులున్న రోగాలకు మందు లేదు
మందు లేదన్న డాక్టర్లు మనగ లేరు
కలికళంకమహాధామ గంగరామ 83

తప్పు లున్న గలుగుటయే గొప్ప తప్పు
తప్పు లేదని చెప్పిన మెప్పు వచ్చు
ఇట్టివి గవర్నమెంటు లో పెట్టె పనులు
కలికళంకమహాధామ గంగరామ 84

ఏటము సమరాల మనుష్య లాట బొమ్మ లంట
కలియుగ పాశుపతాస్త్రమంట
వివిధ దేశ వినాయకుల్ వీరులంట
కలికళంకమహాధామ గంగరామ 85

చచ్చిన శవము కొరకని
చావలేని శవము లేచ్చను
కుండలాల్ చెవుల గుట్టి
శాస్త్రి లేద్దురు చచ్చిన శాస్త్రములకు
కలికళంకమహాధామ గంగరామ 86

తెలుగు వారిలో పట్టాభి పలుకుబడిని
ఎంచి చూచుట కష్టము దెట్టులనిన
ఇంటి ప్రక్కను జేరనీ దింటిప్రక్క
కలికళంకమహాధామ గంగరామ 87

శని వహించిన వారికి
శ్రీమలు పీడు నేడు సంవత్సరాలలో
పాడు మంత్రి సత్తములు కొందరు విడరు చచ్చు
వరకు
కలికళంకమహాధామ గంగరామ. 88

ఇహము నిజమని తేలిన దెన్నడో
కనీనిక కదలి పోవు మనీషు లంత
దాచి పెట్టి బోధించిరి తమ ఘనతలు
కలికళంకమహాధామ గంగరామ. 89

వేద బాహ్యులు వీరని బోధ జేసి
పేద వారికని చితులు పేర్చి నారు
కడకు వారు జూడగ తామె గాలి నారు
కలికళంకమహాధామ గంగరామ 90

తెలుగు పెద్దలు సినిమాలు దీయ లేరు
కాని ఇల్లిటరేటులే మేని డబ్బు
గలుగు నంతలోననె దీయ గలుగుదురట
కలికళంకమహాధామ గంగరామ 91

అప్పకవికి తెలుసునులే పప్పు చారు
గొప్ప కవులు గలరు వారి గొప్ప తనము
చిన్నయ నవసూరికి చాల చిన్న తనమె
కలికళంకమహాధామ గంగరామ 92

తిరుపతియు వేంకటేశ్వర తీర్థ మందు
మొదలు బెట్టి శ్రీశ్రీ దాక
మోడు లెచ్చినయో చిగిర్చిన కవితకు పేచి లేదు
కలికళంకమహాధామ గంగరామ 93

కృష్ణశాస్త్రికి ఊర్వశి కీర్తి దెచ్చె
అంతలో నారి పోయెడు
వంత కారి కవిత వ్రాయు వారెందరో గలరు నేడు
కలికళంకమహాధామ గంగరామ 94

జీవితపు తెడారిని రేగు చీకు ముల్లు
బ్ర భోగము దైపోవు భోగ మిట్టి
రోగమే పరపంచ నుద్యోగ మయ్యె
కలికళంకమహాధామ గంగరామ 95

భూమి పుట్టినప్పటి నుండి బోధ జేసి
మనిషి పుట్టినప్పటి నుండి మాటు కేగి
తెలివి రాగ అదృశ్యుడై దేవు డేగె
కలికళంకమహాధామ గంగరామ 96

అవసరాన్ని బట్టి మనిషి
అనుసరించి తిరుగును
తిరిపెమెత్తును తిండి కొరకు
కాని తన యహంకారము కరుగ నీడు
కలికళంకమహాధామ గంగరామ 97

మానవుడికి స్వార్థము లేక మార్గినుకుండు నే
అబద్ధాలు చెప్పాట
నీకు నాకు అందరికి
అలవాటులో అందుబాటు
కలికళంకమహాధామ గంగరామ 98

నిన్న సంగతి ఏమిటో నీవెరుగవు
నేటి బాధలో పడలేవు నీవు
గాన రేపటికని యత్నించుము మానక నే
కలికళంకమహాధామ గంగరామ 99

తత్వ శాస్త్ర మన్నంతలో ధర్మ బోధ యని
చటుక్కున వాగుదు రన్న వట్టి మాట
ధర్మ మనగ బుద్ధి మాంద్య మయ్య
కలికళంకమహాధామ గంగరామ 100

మన తెలంగాణ మాగాణమున గలవు
నిజముగ బంగారు పంటల చాళ్ళు
సాగు జేయు వాడొకడే తక్కు వోయి దేవ
కలికళంకమహాధామ గంగరామ 101

తెలివి తేటల యందు
ప్రాచ్యులు ఘనులని తెలియ వలయును
మనము సుధీ నిధులము
వాగ గలుగుట గొప్ప నిర్వాకము గద
కలికళంకమహాధామ గంగరామ 102

రమణ ఋషికి కూర్చుంచుట
రాజితముగ నేర్పిన నరుడే పూజ్యుడు
నేటి లోక మిట్టి స్టంటు మాష్టర్లకు నిరవు లెండి
కలికళంకమహాధామ గంగరామ 103

బ్రతికి సంత కాలము
మన పౌరుషమ్ము మంట గలవని విధమున మనగ వలయు
చచ్చు నాడు మనిషి వోలె చావ వలయు
కలికళంకమహాధామ గంగరామ 104

ఈ జగత్తెందుకో మరి
మోజులేని రాజకీయాల కొంగొత్త మేజువాణి
చోటు లేని సినిమా థియేటరయ్యె
కలికళంకమహోధామ గంగరామ 105

చివరిదిది పాత వాసన చీలికలకు
మొదటిదిది క్రొత్త వాసన మోతు బరికి
పాత కొత్తల మధ్యలో కోత నిజము
కలికళంకమహోధామ గంగరామ 106

మానవుడు దేవుడేనని మరువ రాదు
విప్లవోద్రేక వేదన లీడ రాదు
కవులు పుట్టు దేశము వెనుకబడ రాదు
కలికళంకమహోధామ గంగరామ 107

దివిజ లోక భయంకర పవర మిద్ది
మనుజ శుభంకరానంత మథన మిద్ది
రక్త జలపాత మేళన రాగ మిద్ది
అగ్ని సింహాసనాసీన రాజి యిద్ది
కలికళంకమహోధామ గంగరామ 108



పద్మశాలి ప్రింటింగ్ ప్రెస్, రాజమొహల్లా, హైద్రాబాద్ (దక్కన్)

# సవరణ

పీఠిక, రెండవ పేజీ మొదటిపంక్తిలో 'అవసరమైన' బదులు
'అనవసరమైన'-7 వ పేజీలో 4 వ పద్యంలో 'మనసేగద ఓ'